అంకితం:

హైద్రాబాద్, కాశ్మీర్,
తిరువాన్కూర్ మున్నగు సంస్థా
నాల్లోని ప్రజాపోరాటాల్లో
ప్రాణాలు బలియిచ్చిన
అజ్ఞాతవీరులకు—



మనవి:

ఈ కథాసంపుటిలో
చాలాభాగం
సంస్థాన ప్రజాపోరాటాలను
ప్రతిబింబించే కథలే
కూర్చబడినాయి.

రచయిత.

# 'గెలుపు మనదే'

(కథల సంపుటి)





రచయిత:

పర్చా దుర్గాప్రసాదరావు.

అర్ధరూపాయి

# విషయ సూచిక

# గెలుపు మనదే

"జై!"

ఘల్లుమన్నై వేలకంఠాలు. ఒకేవరసలో ఒకేస్థాయిలో ఒకే రెప్పపాటులో వేలకంఠాలు కలిసి అరిచాయి. ఇన్నికంఠాలకు ఈ ఒక్క శబ్దంతో అంతదెగ్గరి చుట్టరికం ఏమిటో! నానా కులాల, మతాల, వర్గాల కంఠాలున్నాయి వాటిల్లో. అనేక అభిరుచులవాళ్లు, అనేక అభిప్రాయాలవాళ్లు, మితవాదులు, అతివాదులు, తీవ్రవాదులు, విప్లవవాదులు, కవులు, కథకులు, కూలీలు, రైతులు, వ్యాపారులు, విద్యార్థులు.

రాస్తూ, రాస్తూ ఆశ్చర్యంతో కలం వదిలేసి మేడ మీది కిటికీలోనుంచి ఇవతలకి తొంగిచూచాడు ప్రణయకవి రమణరావు.

"ఆమె పాదాల అందియ లదరినపుడు
కోటి దేవాలయాలు గగ్గోలుపెట్టె"

అని వ్రాస్తున్న కాయితం రమణరావు పాదాలమీదకు జారిపోయింది చేతిలోనించి. రమణరావు బయటి ప్రపంచాన్ని ఖచ్చితంగా చూచాడు. సాయంత్రం అయిదు గంటలు కనిపించినై. దూరం దాకా పరుచుకున్నారు ప్రజలు. శ్రావణ మేఘాలు వాళ్ల తలలమీద గడగడా ఉరిమాయి. ఇంద్రధనుస్సులు విరిసినట్లు ఎగురుతున్నాయి త్రివర్ణపతాకాల వరసలు. రమణరావుకు మరీ ఆశ్చర్యం వేసింది. వీళ్లను ఇంతగా ఆకర్షి

స్తున్న సౌందర్యాధిదేవత ఎవరు? హృదయేశ్వరి అయ్యుండాలి! కానిచో ప్రభుత్వ నిషేధాజ్ఞల్ని ధిక్కరించి ఇలా గుమిగూడడం దేనికి?

"మన సంస్థానం భారతయూనియన్‌లో చేరాలి" దూరశ్రవణధ్వని వినిపించింది.

స్వాతంత్ర్యపోరాటాలుఅంటూ ఎన్నో జరిగాయి భారతదేశంలో, కాని మన సంస్థానం ఆ గొడవలకు దూరంగా వుండిపోయింది శాంతంగా, అనుకున్నాడు రమణారావు.

"బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం కావాలి" అన్నది దూరశ్రవణధ్వని. రమణారావు ఈమాట గుర్తుపట్టాడు కంఠస్వరం. కోదండపాణీ, తానూ కలిసి చదువుకున్నవాళ్లు. చదువుకునే రోజుల్లో సైతం కోదండపాణి వొట్టి అల్లరివాడు. పంతుళ్లతో యుద్ధం చేయడం, సమావేశాలు జరపడం, పత్రికలు పంచడం, చత్తాకాణీభాషలో ఉపన్యాసాలుకొట్టడం, దేశమంతా మనదే, మనమే మింగాలనడం అతని సామాన్యలక్షణాలు.

రమణారావు నిశ్శబ్దజీవి. శ్రమచేసి చదివేవాడు. వ్యాకరణం తప్పకుండా భాష మాట్లాడేవాడు, వ్రాసేవాడు. అదీ చాలక ఛందస్సుకు కట్టుపడ్డ రచనలు చేయడంకూడా నేర్చుకున్నాడు. ఇంకా పద్మబంధాలను కూడా ఎగబాకుతాడనుకున్నారు మిత్రులు, కాని అంత రసాభాసానికి రాలేదు.

ఇప్పటికి కోదండపాణీ, రమణారావు తమరూపాలు తాము దిద్దుకున్నారు. కోదండపాణి ప్రజానాయకుడు. రమణారావు మహాకవి. రమణారావుకు జమీందార్లూ, మేడలో,

హృదయేశ్వరులు, స్వప్నాలుదొరికాయి. కోదండపాణికి పోలీసులు, జైళ్ళు, పోరాటాలు, పేదలు దొరికారు. చాలకాలం గడిచింది. వొకర్ని వొకరు కలుసుకునే అవకాశం కూడా కలగలేదు. ఇవాళ అనుకోకండా కోదండపాణి ధ్వనివినడం, అతన్ని దూరంనుంచి పోల్చుకోవడం జరిగింది రమణరావుకి.

రమణరావుకి ఇన్ని వేల ప్రజల యేకాభిప్రాయం చూచి కలిగిన ఆశ్చర్యం వదల్లేదు. తాను వెనక సభ్యుడుగా చేరిన నవకవి పరిషత్తులో పదకొండుగురిలో ఇరవై రెండు చీలికలుండేవి. ఎన్నడూ ఏవొక్కడూ ఏకాభిప్రాయం కలిగి వుండేవాడుకాడు.

శ్రావణమేఘం పెద్దగా వురిమింది. దూరంనుంచి ప్రకృతి బరువెక్కిన యౌవనంతో వొంగి తొంగి చూస్తున్నది. 'వర్షం కురిస్తే లాభంలేదు. ఆశోభంతా నీళ్ళల్లో కలసిపోతుంది' అనుకున్నాడు రమణరావు. ప్రజలు తండోపతండాలుగా సమావేశంలో చేరుతున్నారు సముద్రంలోకి నదులమాదిరి. మూడు రంగుల జండాలు పచ్చని చెట్ల తలల్లో పడగలు విప్పుకుని నృత్యంచేస్తున్నాయి.

'ఈ జండానీడ 40 కోట్ల భారతీయులకు ఆశ్రయం' అన్నది కోదండపాణి దూరశ్రవణధ్వని.

రమణరావు వెనుదిరిగి చూచాడు. తాను వొంటరిగా నిర్మానుష్యమైన గదిలో జైలులో మాదిరి చిక్కివున్నట్టనిపించింది. నిర్జీవంగా, నిశ్శబ్దంగా వున్న తన గదిని వదిలేసి ఆ కిటికీలోనుంచి కిందికి దూకాలనిపించింది. తనలో ఏమిటో చల్లదనం ఆవరించుకునివుంది. రక్తం ముద్దగట్టే చల్లదనం.

చలి, వేళ్లు వొంకరలుపోయే చలి. టీ చాలదు. (Whisky) చాలదు ఆ చలి పోగొట్టడానికి. వొంటరిగా కట్టుబడివున్న పంజరంలోని పిట్టమాదిరి, పగలంతా ఇంట్లో కట్టివేసిన కోడె దూడమాదిరి, బుట్టలో నాగసర్పం మాదిరి భావించు కుంటు న్నాడు తనను రమణరావు. అయితే ఈ గదిలోనుంచి ఎగిరి వెళ్ళిపోలేడా ? చేతికీ కాళ్ళకూ ఎక్కడా బంధాలులేవే ? గది తలుపులూ తెరిచున్నాయి. దిగివెళ్ళిపోవొచ్చు. పొంగులెత్తే మహా ప్రవాహంమాదిరి ప్రజాసమూహంలో ఈదవొచ్చు. మరి కదలడేం. రమణరావు కదల్లేకపోయాడు. వాల్చిన తల పైకెత్తి మళ్ళీ కిటికీలోనుంచి అవతలికి చూచాడు. ఇంకో సమూహం. ఒకేతీరు డ్రెస్సులు, తుపాకీలు, లాఠీలు, మోటార్లు. ఎవళ్ళువీళ్ళు ? ప్రజాసముద్రంమీదికి దాడి వెళు తున్న దావాగ్ని.

"ప్రజలారా ! భారతదేశం విముక్తమైపోయింది. మన సంస్థానంచుట్టూ స్వాతంత్ర్య సముద్రం పొంగింది. మన బానిస గడ్డను అందులో కలిపేయాలి." కోదండపాణి వాణి విన వచ్చింది.

తుపాకులు పేలినై. లాఠీలు విశృత విహారం చేసినై. మెరుస్తున్న మేఘం కురిసింది. ఘోరునవర్షం.

"ప్రభుత్వపశుబలానికి జడియకండి. మనదేగెలుపు, మనదే" అన్నది కోదండపాణిగొంతు వర్షంలో.

అవును చల్లని నీళ్ళమీద దాడిచేస్తే నిప్పు గెలుస్తుందా? అనుకున్నాడు రమణరావు తన కవిత్వభాషలో.

రమణరావుకు ఆ రాత్రి నిద్రపట్టలేదు. నానకురుస్తోనే వుంది. చెవుల్లో కోదండపాణివాణి. గుండెల్లోపోలీసుల తుపాకీ మ్రోత. తలలో ప్రజాసముద్రంరొద. పడకలో దొర్లు తున్నాడు రమణరావు. ఏమిటో వేదనగావుంది. మూలుగు తున్నాడు.

'ఎందుకూ! మూలుగుతున్నారు' అంది 'కవిత' రమణ రావు భార్య. మెత్తని పట్టుచేతుల్తో చెంపలు తట్టుతూ పక్కగా కూచుంది కవిత.

"నూ పడుకో" అన్నాడు రమణరావు

'పడుకోనే వొస్తున్నా' అంది కవిత

'మళ్ళీ పడుకో'

'మీరు పడుకోరేం'

'నాకు నిద్దరరాదు, ఇహా యెన్నడూరాదు'

'నేను నిద్రతెప్పిస్తా' అంది కవిత. సిల్కుచీరె కొంగుతో రమణరావు కన్నులు అద్దింది.

"అబ్బో! చలి" అన్నాడు రమణరావు

'నేను వేడిగా వుంటాను' అంది కవిత. వెచ్చని పెద వులు రమణరావుకు తాకినై.

'చలి తగ్గడంలేదు, అన్నాడు రమణరావు. వొణికి పోతున్నాడు.

'ఇట్లా చల్లబడిపోయారేం' అంటూ రమణరావును వొదిలేసింది కవిత. రమణరావు మొహం తిప్పేసుకుని పడు కున్నాడు.

'జ్వరంలాగుందే '!అంటూ కవిత వెళ్ళిపోయింది. డాక్టరు పరీక్ష చేస్తుంటే 'గెలుపు మనదే' అన్నాడు రమణరావు 'మలేరియా' అన్నాడు డాక్టరు.

* * *

15 ఆగస్టు తెల్లవారింది.

'ఇంక్విలాబ్ జిందాబాద్ ! భారతయూనియన్ జిందాబాద్' అంటూ అరెస్టుచేయబడిన ప్రజలంతా మహోత్సాహంతో లారీల్లో జైళ్ళకు వెళ్ళిపోతున్నారు. వాళ్ళ వెనకాల స్త్రీలజట్టు త్రివర్ణ పతాకాలతో వొస్తోంది. 'ఇంక్విలాబ్ జిందాబాద్'

'భారత యూనియన్ జిందాబాద్' అంటూ స్త్రీల కంఠధ్వని ఆకాశానికి అందుతున్నది. ప్రళయ కాళికలవలె వొస్తున్నారు స్త్రీలు.

'వెనక్కి వెళ్ళిపోండి' అన్నాడు పోలీసు అధికారి

'మేం పోం' అన్నారు స్త్రీలు

'వెళ్ళిపోండి' అన్నాడు మిలిటరీ అధికారి

స్త్రీలు ముందుకే కదిలారు. లాఠీలవర్షం కురిసింది. వెనుకనుంచి విద్యార్థుల సమూహం అందుకుంది. తుపాకులు పేలినై. రమణరావు మేడదిగి పరుగెత్తుకువచ్చాడు. అమాయకులు బలిఅవుతున్నారు.

'ఆగండి ! ఆగండి !' అన్నాడు రమణరావు. రమణరావు స్వరం ఆ కోలాహాలంలో తేలిపోయింది.

'కాల్చకండి, కాల్చకండి' అన్నాడు రమణరావు పోలీసు అధికారుల్తో. కాల్పులు సాగుతూనే వున్నై. పోలీసులేకాదు, గూండాలుకూడా ప్రజలమీద దాడిచేస్తున్నారు.

"ఎందుకుచంపుతారు" అన్నాడు పోలీసు అధికారితో రమణరావు.

"నువ్వెవరు ?" అన్నాడు పోలీసు అధికారి

"నేను మహాకవిని"

"అయితే"

"నేను ప్రజల్ని శాంతింపజేస్తాను, మీ కాల్పులు ఆపండి" అన్నాడు రమణరావు. కాల్పులు ఆగినై. దెబ్బతిన్న పులులమాదిరి ప్రజాసమూహం రమణరావు వంక చూచింది.

"ప్రజలారా! శాంతంగా చెదరిపోండి" అన్నాడు రమణరావు.

"మేం పోం" అన్నారు ప్రజలు.

"మీరు వృథాగా చస్తారు" అన్నాడు రమణరావు.

"మేం చావడానికే వచ్చాం" అన్నారు ప్రజలు.

"ఏం లాభం?"అన్నాడు రమణరావు. ఈమాటు రమణరావు మాటను వినిపించుకోనైనా లేదు ప్రజలు. ప్రజాప్రవాహంలో వెనుకనుంచి పెద్దపెద్ద వరదలు కలుస్తున్నాయి. నిమిష నిమిషానికీ ప్రజలు పెరిగిపోతున్నారు. పోలీసులు తరిగిపోతున్నారు. చనిపోయిన ప్రజల రక్తంలో తడిసిన పతాకంతో కోదండపాణి ఎత్తయినగోడమీద నుంచున్నాడు. ప్రజలు"జై" అన్నారు.

"ప్రజలారా! ముందుకు సాగండి. వెనక్కు తగ్గేది లేదు. పదండి ముందుకు. బలి అయిన సోదరుల రక్తాన్ని సార్థక పర చండి"అన్నాడు కోదండపాణి. ప్రజాప్రవాహం రమణరావును నెట్టుకుని ముందుకు పోతోంది. ప్రజల పాదాల కింద నలిగిన పోలీసుశవాలు వెనక మిగిలాయి. వాటిదగ్గరగా రమణరావు మిగిలాడు. తాను యెటు? శవాల వైపా? చైతన్యం వైపా? అద్వైతస్థితి వీల్లేదు. ఎటో తేల్చుకోవాలి. రమణరావును ఈ ప్రశ్న గుండెల్లో గుచ్చుతోంది. అప్రయత్నంగా రమణరావు అడుగులు ప్రజలవెంట నడిచినై. చేతిలో జండా యెగిరింది. ప్రజలు యథాస్థలంలో సమావేశమైనారు. కోదండపాణి వాణి "గెలుపుమనదే, గెలుపుమనదే" అంటూంటే ఘల్లు మన్నై లక్షకంఠాలు ఒకేవరసలో, ఒకేస్థాయిలో—

"జై"



# పన్నులు యివ్వం

వెంకయ్య నిన్న పగలల్లా చాలా విచారంగా కూచు న్నాడు ఇంట్లో. సాయంత్రం కాగానే యెవరో అతన్ని పిలుచుకో వెళ్ళారు, రాత్రి సాంతం ఎటో వెళ్ళిపోయాడు ఇంటికి రాకుండా. ఇవాళ వుదయాన ఇంటికి వుత్సాహంగా వొచ్చాడు. అసలు ఇవాళే విచారపడవలసింది.

అంబలి తాగేసి చుట్ట ముట్టించి బజారువెంట ఇటూ అటూ తిరిగాడు. వూరంతా వుత్సాహంగానే కనుపించింది వెంకయ్యకి. 'చావిడీ' లో దిగిన పోలీసుల్నీ రెవెన్యూ అధి కారుల్నీ ఒక మాటు చూచివొద్దామని బయలుదేరాడు. వాళ్ళ ముందరినుంచి వెళుతూ నవ్వుకున్నాడు, ధీమాగా వాళ్లను దాటి వెళ్ళిపోయాడు.

'వెధవలు! వెధవలు' అంటూ రైతుసంఘం ఆఫీసులో అడుగుపెట్టాడు.

"ఏమిటి వెంకయ్యా!" అన్నాడు సూరి, సంఘంవర్కర్.

"ఏముందీ, వొచ్చారు చుట్టాలు" అన్నాడు వెంకయ్య.

'జాగర్త మరీ' అన్నాడు సూరి.

'ఓ! లక్షేం' అన్నాడు వెంకయ్య.

'మీవీధి వాళ్లంతా గట్టిగా నుంచుంటారా?' అన్నాడు సూరి.

'నుంచోక ఏమించేస్తారు' అన్నాడు వెంకయ్య.

'వెళ్ళి అదే పనిలో వుండు' అని వెంకయ్యని పంపించేశాడు సూరి. ఆ రోజల్లా పన్నుల వసూళ్లకు రాలేదు అధికార్లు. సాయంత్రానికి యింకా కొంత పోలీసు సిబ్బందివచ్చింది. ఆ రాత్రి వెంకయ్య మళ్ళీ మీటింగ్ వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు తన వీధి రైతుల్నందర్నీ తీసుకో వెళ్లాడు.

* * *

[ తెల్లవారి మధ్యాహ్నం ]

'వెంకయ్యున్నాడా' అని వచ్చాడు పోలీసు.

'లేడు, అంది అంకమ్మ వెంకయ్య భార్య.

'ఎటు వెళ్లాడు' అన్నాడు పోలీసు.

'తెలీదు' అంది అంకమ్మ,

'ఎప్పుడొస్తాడు' అన్నాడు పోలీసు.

'తెలీదు' అంది అంకమ్మ.

'ఎన్నాళ్ళు తప్పించుకుంటాడు? మళ్ళీ వొస్తాం వుండమను' అంటూ వెళ్లిపోయాడు. పోలీసువాడు మూలతిరగ్గానే వెంకయ్య వచ్చాడు ఇంటికి. స్నానంచేసి అన్నం తిని పడుకున్నాడు. మళ్ళీ పోలీసువాడు వచ్చాడు.

'వెంకయ్యా!' అన్నాడు

'ఏం' అన్నాడు వెంకయ్య

'దొర రమ్మన్నాడు'

'దొరనే రమ్మను' అని దుప్పటి బిగదీసుకున్నాడు వెంకయ్య. మళ్లీ కాస్త సేపటికి యిద్దరు పోలీసులు వచ్చారు.

'వెంకయ్యా!' అన్నారు.

'వెంకయ్య లేడుపో' అన్నాడు వెంకయ్య.

'నువ్వేగా' అన్నారు పోలీసులు.

'అవుతే యేం' అన్నాడు వెంకయ్య.

'రా' అన్నారు పోలీసులు.

'రాన్ పో' అన్నాడు వెంకయ్య.

పోలీసులు వెళ్లిపోయారు. మళ్లీ కాసేపటికి చాలా మంది వచ్చి గుమ్మం తట్టారు.

'ఎవరూ' అన్నాడు వెంకయ్య.

'తలుపు తీ' అన్నారు బిగ్గరగా.

'ఎవరో చెప్పు' అన్నాడు వెంకయ్య.

'గిర్దావరు దొర' అన్నారు.

'ఏం ముంచుకుంది' అన్నాడు వెంకయ్య.

'పన్నుకట్టాలి'

'లేదు పో' అన్నాడు వెంకయ్య.

'తలుపు తీసిచెప్పు' అన్నారు.

'ఏంతీస్తే' అంటూ బయటికి పరుగెత్తుకొచ్చాడు వెంకయ్య. పదిమంది పోలీసుల్నీ, అధికారినీ చూచి కొద్దిగా జంకాడు. రెండు రాత్రుల తరిఫీదుకు మళ్ళీ వెంటనే ధైర్యం వచ్చేసింది.

'మేం పన్నులివ్వం' అన్నాడు గభాల్న.

'నువ్వు ఇవ్వవా' అన్నాడు గిర్దావరు

'నేనేకాదు, వూరంతా, దేశమంతా,

'ఏం—''

'ఇన్నేళ్ళనుంచి ఇచ్చిన పన్ను లేమైనై'

'ఖర్చు కాలా ?'

'మీ జీతాలకా ?'

'ఏం అట్లా అడుగుతావ్ ?'

'అడక్కేం ? మావూరిమీద యేటా వసూలయ్యే యెనమిదివేలకూ లెక్క చూపించు, పోనీ సగానికి చూపించు. చెరువులన్నీ వొండు పేరుకోపోతే బాగుచేయించేది లేదు. వ్యవసాయం పనిముట్లు సప్లై చేయడంలేదు, ఎరువులు లేవు. రోగాలకి మందులేదు, చస్తున్నాం. వున్న గింజంతా మీరే తోడుకుంటారు, అన్నాడు వెంకయ్య.

'నువ్వనేదేమిటో చెప్పు' అన్నాడు గిర్దావరు

'పన్నులు కట్టం మీకు'

'యెవరికక్కడతారు ?

"మాకు ఈ అధ్వాన్నపు ప్రభుత్వము వద్దు, ఫోండి" అని గద్దించాడు వెంకయ్య. పోలీసువాడి కళ్లల్లోకి నెత్తురు తిరిగింది. గొంతులో కోపం మింగుతూ—

'ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా' అంటూ వెంకయ్య మీదికి వచ్చాడు పోలీసువాడు.

'పోవయ్యా! మీ జడిపింపూ మీరూనూ ! అంటూ విదిలించేశాడు పోలీసుని.

'నరికేస్తాం జాగర్త' అన్నాడు పోలీసు.

'మమ్మన్ని సరికి నువ్వు పాలం దుంతావా?' నెత్తురు కక్కి చస్తావ్. తుపాకీపుచ్చుకోతిరిగితే సరిపోయిందీ'అన్నాడు వెంకయ్య.

పోలీసువాడు బలంగా లాగికొట్టాడు వెంకయ్య చెంప మీాద. ఇంకొక పోలీసువాడు వెనకనుంచి కఱ్ఱతో వెంకయ్య బుఱ్ఱమీాద వేశాడు. వెంకయ్య పడిపోయాడు. నెత్తురు వరద లైంది. స్పృహా తప్పిపోయాడు. ఇంకాకొట్టారు. మరీకొట్టారు. అంకమ్మనికొట్టారు. అంకమ్మ కిందపడింది. పోలీసులు అంకమ్మ చీర లాగేశారు.

జనసమూహం అందుకుంది. పోలీసులు కాల్చారు. ప్రజలు రాళ్లురువ్వారు. గిరదావరు పలాయనం చిత్తగించాడు. పోలీసుల ప్రాణాలు కొన్నిపోంది తప్పలా. చచ్చినవాళ్ల నెత్తురులో తడిసిన జండాలు ఎగరవేస్తూ ప్రజలు వీధులవ్వూరేగారు.

మరునాటి వుదయాన మిలిటరీ వచ్చింది. అయిదువందల మందిని అరెస్టు చేశారు. స్త్రీలను అవమానపరిచారు. ఇళ్లు తగులపెట్టారు. ఏమైనా చిల్లిగవ్వపన్ను వసూలుకాలేదు. పైగా వేలడబ్బు ఖర్చైంది.



# గూండాల రాజ్యం

'డాక్టర్ జీ!' అన్నారెవరో క్రిందినుంచి. బంగళాపై అంచున టీ తాగుతున్న డాక్టరుగారు కప్పు వదిలేసి కిందికి నడిచారు. తలుపు తెరిచేసరికి వొక సాయెబుగారు దీన స్వరంతో—

'డాక్టర్ జీ! మా అమ్మాయికి చాలా జబ్బుగావుంది. తాము అర్జెంటుగా రావాలి. తమరు రాకుంటే నేను ఇక్కడే చస్తాను' అన్నాడు. డాక్టరుగారికి ఏమనడానికీ తోచలేదు. పగులల్లా శ్రమచేసివున్న డాక్టరు చాలా బడలిపోయి వున్నారు, కాని కాదనలేకపోయారు.

'మీా యిల్లెక్కడ?' అన్నారు డాక్టరు.

'చాల దగ్గిర, నేను చూపిస్తా, యిక్కడే' అన్నాడు సాయెబు. డాక్టరు స్టెథస్కోప్, మందులసంచి తీసుకుని కారులో బయలుదేరారు. అయిదు నిమిషాల్లో యిల్లు వచ్చింది. గుండె నెప్పితో బాధపడుతోంది సాయెబు అమ్మాయి. పరీక్ష చేసి ఔషధం ఇచ్చారు. బత్తాయుల ఆహారం ఇమ్మన్నారు. సాయెబు మొహం తేలవేశాడు. డాక్టరు జేబులోనుంచి రెండు రూపాయిలు తీసి యిచ్చివేశారు. సాయెబు పళ్ళకోసం వెళ్ళాడు. సాయెబు కుమార్తె డాక్టరువైపు కృతజ్ఞతతో చూస్తూ.

'మీరు గనుక వొచ్చారు. గవర్నమెంటు డాక్టరు మాకులం వాడైకూడా రాలేదు. నే నేమి రానన్నాడట. మీరు నా మీద దయతలిచారు. మీరుణం ఎట్లా తీర్చుకోను" అన్నది.

'ఫరవా లేదు, ఇదేమంతపని ?' అన్నారు డాక్టరు. సాయేబు పళ్లు తెచ్చాడు డాక్టరుగారు వెళ్లిపోయారు.

* * *

ఆరోనాటికి జబ్బుకుదిరింది. ఆనాటి సాయంత్రం సాయెబూ, ఆతని కూతురూ డాక్టరు వద్దకు కృతజ్ఞత తెలుప డానికి వచ్చారు. డాక్టరు లేరు. వొచ్చేదాకా కూచుంటానికి నిశ్చయించుకున్నారు. చాలాసేపుదాకా రాకపోవడంమూలాన సాయెబు ఏదోపని చూచుకోరావడానికి బజారు వెళ్లాడు. కూతురు మాత్రం డిస్పెన్సరీలోనే కూచుంది.

డాక్టరు వచ్చారు. సాయెబు రాలేదు. మేడపైకి డాక్టరు వెళుతుంటే ఆయిన వెనకాలే సాయెబు కూతురు వెళ్ళింది తన జబ్బు తగ్గించినందుకు కృతజ్ఞత తెలుపుతూ.

'మీరుణం ఎట్లా తీర్చుకోను ?' అని పాత సందేహా ప్రశ్న అడిగింది. డాక్టరు జవాబు చెప్పనేలేదు, ఆయన్ని కావిలించుకుంది. డాక్టరు వెనక్కి జరిగి తప్పుకున్నారు. ఇంతలో సాయెబు వచ్చాడు. కృతజ్ఞత తెలిపి వెళ్లిపోయారు సాయెబూ, కూతురూ.

ఆనాటి రాత్రే మతకలహాలు చెలరేగినై. గూండాల ముఠా వొకటి వచ్చి వొక వీధిమీద దాడిచేసింది. ఇళ్లు తగల

బడినై. అజాగ్రతగావున్న ప్రజలు కొందరు చావందితప్పలేదు. వెంటనే వీధిలో ప్రజలంతా జాగ్రతపడి గూండాలను తరి మారు. కాలుతున్న యిళ్లు చల్లార్చుకున్నారు.

ప్రజలు విజృంభించేసరికి గూండాలు తోకముడిచారు. ఇంకో వీధిమీద ముట్టడికి నడిచారు. ఆ వీధి ప్రజలు కాచు కూచున్నారు కనుక గూండాలకు ఎటూ దారి దొరకలేదు. రెండు వైపులా ప్రజాసమూహం పొంగివచ్చింది. గూండాలు చేతులు పైకెత్తారు. కాళ్లు తేలవేశారు. ఇంతలో భగవంతుని వరం మాదిరి పోలీసు సాయుధదళం గూండాలకు సహాయం వచ్చింది. ప్రజలు ఆశ్చర్యపోయారు. ప్రజారక్షకులు గూండా లకు సహాయం చేస్తారా? అని ముక్కుమీద వేలు వేసుకు న్నారు. పోలీసులూ, గూండాలూ కలిసి ధీమాగా ముందుకు సాగారు.

'చెదిరిపొండి' అన్నాడు పోలీసు అధికారి.

'గూండాలను చెదగగొట్టండి. మేంచెదరిపోతాం. వాళ్లని వెనకేసుకోరాకండి' అని అరిచారు ప్రజలు. పోలీసులు ప్రజల మాట వినకుండానే కాల్చారు.

గూండాలగుంపు మునుపటి వీధిమీదికే మళ్లీ దాడి చేసింది. విజృంభించి జరిగింది ఈ మాటు దాడి. అర్జెంటు కేసు మీద వెళ్లివస్తున్న డాక్టరు ఆదారినే కారుమీద వొస్తున్నారు. డాక్టరుకు మతాలంటే గిట్టవు. సర్వమానవ సౌభ్రాతృత్వం ఆయనలో జీర్ణించుకుంది. ఎవరు పిలిచినా చికిత్సకు వెళతాడు. ధనికుడూ. పేదా, హిందూ, ముస్లిం తేడాలు ఆయనలో లేనే

లేవు. తాను ఎవరికీ శత్రుత్వం చేయలేదు కనుక నిర్భయంగా కారులో వెళుతున్నాడు. డాక్టరువద్ద తనకూతురు జబ్బు కుదుర్చుకున్న సాయెబు డాక్టరు కారు టైరులో బల్లెంపోటు వేశాడు. టైరు బర్స్టు అయిపోయి దూరాన ఆగింది. గూండాల గుంపువచ్చి పైనపడ్డది. డాక్టరు నిర్ఘాంతపోయి చూచాడు.

'సాయెబూ!' అన్నాడు డాక్టరు.

'నేనే' అంటూ డాక్టరుగుండెలో బాకు దింపాడు సాయెబు. ప్రజలు డాక్టరును రక్షించడానికి అందుకునేసరికి వెనకనుంచి పోలీసులు కాల్చారు.

ఆరాత్రి గూండాల అసెంబ్లీ సమావేశమై తమరాజ్యం సర్వస్వతంత్రంగా వుంటుందని తీర్మానించుకుంది. ఏ యూనియన్‌లో చేరవద్దని నిర్ణయం జరిగింది. రాజు అందుకు సమ్మతించి ఫర్మాన్ జారీచేశాడు.



# కవి దరిద్రుడు

జాజుముక్కల్లాంటి సాయంకాలపు మబ్బుల్లో నల్లటి పిట్టలు ఈదుకుంటూ పోతున్నాయి. సుందరమైనప్రకృతి కళ్లో పాసకులను ఆహ్వానిస్తున్నది. చెరువునిండా బంగారం పొంగు తున్నది. చెరువులో తామరలు యింకా మూసుకోలేదు. కలు వలు విచ్చుకోడానికి వొళ్లు విరుస్తున్నాయి. వూళ్లో పడుచు లంతా నీళ్లు మోసుకోపోతున్నారు. వాళ్ల రంగురంగులచీరెలు నీళ్లల్లో రంగులు కలుపుతున్నాయి. వాళ్ల తలల్లోని పూల వాసనలు వెగటుగా, చేదుగా, ఘాటుగా, తీయగా విసురు తున్నాయి. చెరువుగట్టున గన్నేరుచెట్టుకు ఆనుకుని కూచున్న నాలో ఏవేవో వూహాలు చేరుకుంటున్నాయి.

కవి యెక్కడినుంచో దూరప్రయాణంచేసి వొస్తు న్నాడు. పాలిపోయిన మొహం, తేలిపోతున్న కాళ్లు, వాలి పోయే నడుం చాలా విసుగ్గా వొస్తున్నాడు. కవి నన్ను సమీ పించాడు. అతని చూపులు దారిని పాకుతూపోతున్నాయి. కమ్మని ప్రకృతిని ఆనందించడానికి దెసదెసలకు పరుచుకునే శక్తిలేదు వాటిల్లో.

"కవీ!" అన్నాను. ఉలిక్కిపడి నావేపుచూచాడు. పొంగివస్తున్న దుఃఖముతో కావిలించుకున్నాడు నన్ను. అప్పు డప్పుడూ గుండె అదుముకొంటున్నాడు. ఎన్నిరోజుల్నించో

ఉపవాసం చేస్తున్న డొక్క చినిగిన బన్యాను లోనుంచి తొంగి చూడుతున్నది. మధుర కళానిలయమైన కవి హృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు పెల్లుబుకుతున్నాయో ఎన్ని తుఫానులు హోరెత్తినాయో ఊహించుకోలేక పోయాను. బ్రహ్మ తన పొట్ట నింపుకోడానికి ఉద్యోగం ప్రారంభించవలసిరావడం ఎంతదుర్గతో కవి తిండికోసం వెతకడం అంతే. కవి హృదయంలో ఎన్నో స్వర్గాలు, నందనాలు గూళ్లు కట్టుకుని వుంటాయి. కవి తనకలం పాయింటులో అజంతా అతిలోకరమణీయ శిల్పాలను కళ్లకు కట్టిస్తాడు. గతకాలాన్ని గారడీచేసి చూపిస్తాడు. ప్రపంచాన్నే మరపిస్తాడు. మన హృదయాల్ని ఎలా అంటే అలా మలచి పారేస్తాడు. అట్టి అమోఘ శక్తిగల కవి పూటపూటకూ నాటికి దేవుళ్లాడుతూ వీధులంట డొక్క చేతపట్టుకొని తిరుగుతూ ఏమిచేయగలడు ? దీనంగా పాలిపోతున్న కవిరెప్పల్లో ఆదీ అంతులేని ఆకాశాలు, సముద్రాలు కదిలినట్లనిపించింది.

"కవీ! యేమిటో యీ ఖర్మం ?" అన్నాను. తన ఖర్మానికి అతను ఏమి అర్థం చెబుతాడు ? అర్థంలేని ప్రశ్నకు అర్థంఅంటూ యేమిటి ? అనుకున్నాను నాలో.

నాచుట్టూ ఆవరించుకున్న సుందరప్రకృతి నన్ను కవి బాధల్ని మరచిపోమంటున్నది. దుర్బుద్ధి ప్రోద్బలిస్తున్నది. నీళ్లెత్తుకోపోతున్న.... తెలగమ్మాయి సౌందర్యానికి ఉచ్చులు విసురుతున్నది. ఏమిటో ఆనందించాలనుకుంటున్న మనస్సు కవిని వాడుకోదలచుకుంది.

'కవీ! ఆపోతున్న ఆమెను. నీ హృదయేశ్వరిగా భావించు. ఆమె నిగ్గుదేరిన బంగారు చెంపల్ని వర్ణించు. ఆమె మోవిని' అన్నాను వెర్రిగా. కళాజీవి హృదయం నన్ను ఆనందింపజేయడానికి ప్రయత్నించింది. తన బాధల్ని మరచిపోవడానికి ప్రయత్నిస్తున్నాడు కవి. సమస్తం మరిచేసి ఆమె చెంపల్ని ఆవహించుకున్నాడు.

'ఆమె కపోల పాళికల
కద్దిన బంగరు రంగుమీద సం
ధ్యా మృదులార్క హ స్తములు
తాండవ మాడెను.'

అన్నాడు కవి. 'ఆమెమోవిపై?' అన్నాన్నేను. కవికి కోపం వచ్చింది.

'ఆమె మోవిపై
శ్రామిక వర్గ రక్త జల
రాశి గభీర జలోద్భ పద్మరా
గామిత రత్న చూర్ణముల
నద్దిరొహాహో! ధనికకక్షుపాచరుల్'

అన్నాడు కవి.

కవీ! ఇంటికి పద! పద! అని తొందరించాను. వేడినీళ్లు స్నానంచేసి, చచ్చిపోతున్న ఆకలి దేవతకు బలి చల్లి, గుండె అదుముకుని పడుకున్నాడు కవి.

ఆంధ్రలోకం కవి సమాసాలకు, రచనానైపుణికి, భావ మాధ్యానికి, రసనిష్పత్తికి లొట్టలుకొట్టి, గుటకలువేసి, వూరు

కుంటుంది. కాని ఏ జమీందారూ తాను ఆర్జించిన పాపిష్టి ఆస్తిలోనుంచి పది ఎకరాలు కవికి వదిలివేయడు; ఏ షావుకారూ పట్టుమని పదిరూపాయీలు విసరడు; ఏ కూలివాడూ కూలిపోతున్న కవి యిల్లు సర్దడు; ఏ రైతూ చేతినిండా కవికి భిక్షం పెట్టడు. ఆపూటకు తిండిదొరికితే చాలు. కవి తనను మహాభాగ్యశాలిగా భావించి లోకాన్ని ఏమిటో చేసివేసే ఆలోచనలు చేస్తాడు. రాజకీయ విప్లవాలన్నింటికీ అంచనా కడతాడు. రెండోపూట యింట్లో తల్లీ, పిల్లలూ మాడేసరికి కుంగి పాతాళానికి దిగిపోతాడు.

కవి సుఖనిద్ర అయిపోయి లేచాడు. తనలో గంట క్రితం వున్న ఆకలి లేదేం? అని వెనుక్కున్నాడు. వదలిపోయినందుకు సంతోషించాడు బుజాలెగరేసి చిరునవ్వుతో నావేపు చూచాడు.

'పెళ్లి చేసుకోవు కవీ! ఆమెను' అన్నాను కొంటెగా నేను. కవిలోని శృంగార తరంగం లంఘించింది.

'నాకు ఆయమతో పరిణయము జరుగ
వ్రాసియున్నదొ నొసటి పత్రమ్ముమీద'

అని నిట్టూర్చాడు.

'కరగి పోతున్న మబ్బుల దరులనొరసి
పరుగులెత్తెడు తెమ్మెర పక్షములకు
అంటుకొని వచ్చినట్టి శీతాంబు కణములు
ఆమె కనుకొలకులలోన ఆవరించె
ఆమె కను బొమ కదలిక లందు ఇంద్ర

ధనువు లెన్నెన్నొ ఆవిర్భవము జెందె
ఆమె క్రీగంటి చూపుల అంచు లందు
కోటి నక్షత్రములతీవె నాటుకొనియె
అడుగు కదలించినపుడెల్ల యొడదతోణికి
గల్లు గల్లున తాళాలు కలుపు కొనియె;
యెడద తోణకిన యపుడు పాలిండ్లు వణకి
మేరు మంధరగిరుల కంపింప జేసె'

ఆశువుగా చెప్పేస్తున్నాడు కవి. పసికుర్రాడి హృదయం కవిది. కుట్రలూ కృత్రిమాలూ యెరుగని అమాయక హృదయం. తన తలమీద ఉక్కుపాదాలతో నొక్కుతున్న సంఘాన్ని లంఘించే సత్తువ లేదు. లొంగిపోయే వోపిక లేదు. దారిద్ర్యం అనుభవించ లేడు. ధనం సంపాదించ లేడు. ఏ వుద్యోగం చేసినా నాలుగే రోజులు.

నాకు బాగా జ్ఞాపకం. కవి ట్యూషన్లు చెబుతున్న రోజులు. పాఠం చెబుతూ చెబుతూ పద్యాలు గొణిగేవాడు. వొక షావుకారబ్బాయికి ట్యూషన్ చెబుతూన్నప్పుడు షావు కారిణీగారి కనుకొసలు కవిని కాటందుకున్నై. ఆవిషం చాలా ఘోరంగా యెక్కింది. మృత్యువు తప్పించుకొని బయట పడ్డాడు కవి.

గవర్నమెంటు స్కూల్లో పనిచేశాడుకవి. నెలకు సగం ఆబ్సెంటు. స్కూలుపీడా రెండో నెలతో వదిలిపోయింది. ఇంతలో ఆకలితో అలో లక్షణా అని తిరిగే కవికి అన్నార్తుల సంఘం కనిపించింది. పేదలసంఘం.

పేదలార !

సాదలార !

మీ బాధాగాధామయ జీవితములకింకే
దారిలేను, ఇదిగిదిగో,
మీ ఆకలి డొక్కల్లో
అగ్ని వృష్టి కురిపించిన
మీ చీకటి కళ్ళల్లో
జీమూతం చిమ్మించిన
మీ వణకే గుండెల్లో
రణఘంటలు మ్రోగించిన
మీ అర్థావృతశరీరాల్ని
అవమానం గావించిన
ధనస్వామ్యలోకాన్ని
హసనం చేయండీ!
ఖననం చేయండీ!
దహనం చేయండీ!

అంటో వాళ్ళ వెంట తిరిగాడు. ధనికప్రభుత్వం కవిని అరెస్టు చేసింది. తల్లీపిల్లలకు తిండెవరు? దిక్కెవరు? తప్పించుకు పారిపోయాడు. అన్నార్తులసంఘానికి రాజీనామాచేశాడు. కాని కవి అన్నార్తిమాత్రం పోలా.

'కవీ! గానంచేయి' అన్నా.

'నేను నీవలె గంధర్వగాన భవ్య
దివ్య సంగీతవీధుల దిరుగలేను.

నేనొక వెర్రినై బ్రతుకునే బరువెత్తిన బండివోలె లో
లోన కృశించు చేడ్చెదను, లోకము శోకముగా దలంతు'

అన్నాడు కవి.

కవిని కొంత సత్కరించి పంపించాను. నా 'సత్కారం' నాలుగునెల్లు గడిపివుంటుంది కవికి. నాలుగు మంచి ఖండికలను కల్పించి వుంటుంది. ఇప్పుడు మళ్లీ యథాస్థితిలోకి వచ్చాడు కవి. కాని, నా సహాయం అర్థించి వచ్చాడుకాడు. రాడు. ఈమాటు నేనే వెళుతున్నా కవిని వెదుకుతూ.



# రెండు జెండాలు

'ఎన్నిసార్లు కాల్చినా ఈ మూర్ఖపుజనానికి బుద్ధిరాదు' అన్నాడు పోలీసు అధికారి జమీందారు రాఘవరెడ్డితో.

"ఇదొక జాడ్యం లాగుంది" అన్నాడు జమీందారు.

"బందిపోటుదొంగలు నయం. వీళ్లు అంతకు మించారు"

"యేండ్లతరబడిగా యేడిపించుకుంటున్నారు"

"ప్రభుత్వం వీళ్లని తుడిచేయలేకపోతోంది"

"ఈ జాడ్యం మా కుటుంబాల్లోకీ వ్యాపించింది"

"మా పోలీసుల్లో వ్యాపించలా!"

"మావాడూ జండాపుచ్చుకో తిరుగుతోన్నాడుకదా"

"ఏమిటో! ఎటూ తోచదు"

జమీందారుగారి మామిడితోట దాటి ఇద్దరూ ఇవతలికి వచ్చారు. తోటగోడకి పెద్ద 'పోస్టరు' అంటించి వుంది. మూడు రంగుల జండా, ఎర్రజండా 'క్రాస్'గా వున్నాయి. వాటి మధ్యగా యెర్రక్షరాలు

"సంస్థానం భారతయూనియన్‌లో చేరాలి"

"బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం కావాలి"

అని వున్నాయి. పోలీసుఅధికారీ, జమీందారూ ఆ 'పోస్టర్'ను నమ్మలేకపోయారు.

"కాంగ్రెసూ, కమ్యూనిస్టులూ ఎట్లా కలిశారు" అన్నాడు పోలీసు అధికారి.

"మీరు చేసిందే..." అని విసుక్కున్నాడు జమీందారు.

"మేమేం చేశాం ?"

"కమ్యూనిస్టు, కాంగ్రెసు విచక్షణ లేకుండా కాల్చారు"

"ఇద్దరూ ప్రభుత్వ శత్రువులే"

"ఇక చచ్చాం పద......" అన్నాడు జమీందారు. ఇద్దరూ నడుస్తూన్నారు. దూరాన్నుంచి నినాదాలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి. నిశ్శబ్దంగా నడచి వెళ్ళిపోతున్నారు. గుండెలు కుదించుకుని నడుస్తున్నారు. వాళ్ళల్లో ఏదో తీరని భయం ఆవరించింది. ఎవళ్ళకు వాళ్ళు తమ భయాన్ని దాచుకోవాలని చూస్తున్నారు.

"రెండు జెండాలూ ఒకటైనై" అని గొణిగాడు పోలీసు అధికారి. జమీందారు వెనకడుగు వేస్తూ మొహం తుడుచుకున్నాడు. "ఆకలేస్తోంది, పదండి..." అన్నాడు పోలీసు అధికారి. మళ్ళీ నిశ్శబ్దం. కొద్దిసేపట్లో పెద్దదారిన 'దేవిడీ' లోకి చేరుకున్నారు ఇద్దరూ. ప్రజల నినాదాలు స్పష్టంగా వినిపించ సాగినై. ఫలహారం చేస్తూ కూచున్నారు గదిలో, జమీందారూ, అధికారీ. ప్రజాసమూహం 'దేవిడీ'కి సమీపంగా వస్తున్నట్టు వినపడుతున్నై ధ్వనులు.

"మిలిటరీ సహకారం రానట్టేనా?" అన్నాడు జమీందారు.

"ఎన్నిచోట్లకని వస్తుంది? No, No అని జవాబులు వస్తున్నాయి పైనుంచి" అన్నాడు పోలీసు అధికారి.

"ఈపూట ఊరేగింపు ఆపలేం" అని నిట్టూర్చాడు జమీందారు.

"ఉఁహుఁ సాధ్యపడదు" అన్నాడు పోలీసుఅధికారి.

ప్రజల కలకలం చాలా దగ్గరగా వినిపించింది. చేతులు కడుక్కొని మేడపైభాగం గదికిటికీలోంచిచూస్తున్నారు ఇద్దరూ. 'దేవిడీ'ముందరి మైదానాన్ని ఆక్రమించుకున్నారు·ప్రజలు. ఆ మైదానంజమీందారుదే.ప్రజలుమైదానంనిండాపరచుకున్నారు. వాడిపోతున్న యెండ మైదానాన్ని వదిలేస్తున్నది. జమీందారు కొడుకు రామచంద్రారెడ్డి యెత్తయిన ప్రదేశంలో నుంచొని చేయి యెత్తాడు. 'జై' అన్నారు ప్రజలు. వెంటనే లోతైన నిశ్శబ్దం పరచుకుంది.

"ప్రజలారా!" అంటూ నిశ్శబ్దాన్ని భేదించాడు రామ చంద్రారెడ్డి. సాయంకాలపుగాలికి రామచంద్రారెడ్డిభుజం మీాది ఖద్దరుకండువా నాగుబాములా పడగెత్తింది.

"ప్రజలారా! సోదర! సోదరీ ప్రజలారా! మనలో మనకున్న చీలికలను ఐక్యపరచిన ప్రభుత్వ దమననీతికి జోహారు లర్పిస్తున్నాను. మనలో ఏ అభిప్రాయభేదంవున్నా ప్రజాక్షేమం లోనే, శత్రువిషయంలోకాదు. సమిష్టి శత్రువును సమిష్టిగా ఎదుర్కోవాలి. ఇవాళ మనగ్రామం నిదర్శనగా ప్రపంచ ప్రజాశక్తుల ఐక్యతకు పునాది వేస్తున్నాం. మార్గం చూపు తున్నాం. మన సంస్థానాధీశుని పశుబలం ఇంగ్లీషు సామ్రాజ్య వాదుల అండతో మన మీాదికి విజృంభించి మనలో ఒక సంఘాన్ని మొదటా, ఇంకో సంఘాన్ని తరువాత చీలదీసి

అణచాలనుకుంది. కాని త్యాగంతో రక్తబలితో, ప్రాణ బలితో నిర్మించిన ప్రజాసంఘాలను సామ్రాజ్యవాదుల నక్కజిత్తులకు బలిచేస్తామా ? లేదు లేదు. మనం విడివిడిగా దుర్బలంగా వున్ననాడు మన పతాకాలను చింకిపాతలుగా చించి, దగ్ధంచేసిన ప్రభుత్వం నేడు గుర్తిస్తున్నది. ప్రపంచంలో అయదవభాగం, నలభైకోట్ల ప్రజల భారతదేశం విముక్తమైనది. ఈ బలవత్తరమైన త్రివర్ణపతాకం నీడనే, అని. "ఇది చింకిపాత కాదు. ఇంగ్లీషు సామ్రాజ్యవాద రాక్షసిని ఉరితీసి ఆకాశావకాశంలో ధృవంగా ఎగసిన త్రివర్ణ పతాకం. కీర్తిశేషులైన భారతవీరుల స్వప్నధనం. ఈ పతాకాన్ని నాశనం చేయడం బ్రహ్మతరంగాదు. సర్వకాలాల్లో హిమాలయ శిఖరాగ్రంలో ఠీవిగా ఆకాశంతో మంతనాలాడుతూ నర్తిస్తుంది మన మువ్వన్నె జెండా. ఈ జెండా మన స్వాతంత్ర్యానికి చిహ్నం. మన ఆత్మబలానికి నిదర్శనం. మన భవిష్యత్తుకు ఉజ్జ్వలమార్గం"

"తిరంగా ఝండా జిందాబాద్" అన్నారు ప్రజలు. రామచంద్రారెడ్డి జెండా పైకిలాగాడు. చాలా ఎత్తయిన గెడకొసలో ఇంద్రధనుస్సుముక్క-మాదిరి సాక్షాత్కరించింది త్రివర్ణ పతాకం.

తరువాత రామచంద్రారెడ్డి సుత్తీ కొడవలి ఎర్రజెండాను ప్రజలకు చూపిస్తూ "ప్రపంచ శ్రామికవర్గానికి పట్టుకొమ్మ ఈ జెండా. ప్రపంచంలో ఆరవభాగమైన రష్యాలో ఇదే జెండా నీడన సామ్యవాదం స్థాపించబడింది. కోట్లాది శ్రామికుల ఆశాజ్యోతి ఈ అరుణపతాక. ఈ పతాకను దించసమకట్టిన హిట్లర్

పేరుమాసిపోయాడు. ఇవాళ ప్రపంచంలో మిగిలిన సామ్రాజ్య శక్తులకు ఎర్రజెండా గుండెలో గాలం మాదిరి వుంది. జమీందారీ, జాగీర్దారీ; పెట్టుబడిదారీ విధానాలను నిర్మూలించే ప్రళయకాళిక యీ జెండా" అని గట్టిగా మాట్లాడేశాడు.

"లాల్ ఝండా జిందాబాద్" అన్నారు ప్రజలు. రామచంద్రారెడ్డి అరుణపతాకాన్ని పైపైకి లాగాడు. త్రివర్ణ పతాకలోని అశోకధర్మచక్రాన్ని, అరుణపతాకలోని ధవళనక్షత్రం ముద్దెట్టుకుంది.

సాయంకాలపు సూర్యుడు రెండు జెండాలమీదా బంగారుకిరణాలహారం వేశాడు. ఎత్తయిన పున్నాగ, తెల్లగన్నేరుచెట్లు పూల జడివాన కురిసినై.

ప్రజానీకం ముక్తకంఠంతో పాడారు.

"ఝండా ఊంఛా రహే హమారా"



# బియ్యం గింజలు

నాగసర్పం మాదిరి మెలికలు తిరుగుతూ, నత్తగుల్లవలె అడుగులు వేస్తూ, తేనెటీగల్లా రొద పెడుతూ రెండు పొడుగాటి పంక్తులు—ఒకటి పురుషలది, రెండవది స్త్రీలది—ప్రభుత్వ ధాన్యపు షాపువైపు నడుస్తున్నాయి. స్త్రీల పంక్తి పురుషుల పంక్తికంటే పొడుగ్గా ఒకఫర్లాంగు దూరందాకా—ఒక ఇరుకు గొందిలోకి మలుచుకొనివుంది. ఆలస్యంగా వచ్చినవాళ్లు ఒకరి వెనక ఒకరు నిలుచుంటున్నారు. వాళ్ళకు ధాన్యపు షాపు చూచాయిగానైనా కనుపించడం లేదు. వాళ్ళకు కనుపించేదల్లా వాళ్ళముందున్న ఆవిడ తల మాత్రమే.

అనేక వందలమంది స్త్రీలు, హిందువులు, ముస్లింలు, పారసీలు, కిరస్తానీలు, యూదులు. ముస్లిం స్త్రీలు బురఖాలున్నవాళ్ళూ, లేనివాళ్ళూ, నల్లగా మెరుస్తున్న బలమైన శరీరాల బోయీస్త్రీలు. వాళ్లుతలల్లో తురుముకున్న పూల పరిమళాలకు సైతం చేపల వాసన వదల్లేదు, పొడుగ్గాటి గవున్లు వేసుకొని చెప్పులు లేని కాళ్లతో వొచ్చిన గోవాసీయస్త్రీలు. సిల్కు-మేజోళ్ళతో, ఎత్తుమడిమల బూట్లతో, గుమ్మమంటున్న చవకబారు సెంట్లతో, పౌడర్లతో ఆంగ్లో-యిండియన్ అమ్మాయీలు. బుజాలమీద పూలశాలువలు వేసుకున్న, బలిసిన, నీలనేత్రాల 'యూదు'వనితలు. సహజశరీర ఆకృతిని చూపించే బిగుత్తయిన చీరెలతో బక్క-పలుచని మరాటాస్త్రీలు. వేలి

పోయిన మొహాలతో బాగా బలిసిన- లేదా- బాగా బక్క చిక్కిన గుజరాతీ పడుచులు. గుమాస్తాల పత్నులు, మిల్లు పనివాళ్ల పెళ్లాలు, టాక్సీ డ్రైవర్ల అర్ధాంగులు, చిన్న దుకాణదార్ల భార్యలు, పెళ్లి జరిగిన భార్యలు, పెళ్లి జరుగని భార్యలు, వాడిన మల్లెపూలూ, చేపలూ, కొబ్బరినూనె, సెంటూ, చెమటా. మిట్టమధ్యాహ్నం సూర్యుడి వేడికి ఆవిరై తేలిపోయిన నానారకాల వాసనలు అదృశ్యమేఘాలై ఎండకాలపు బడలిక తీరుస్తున్నై. మరాటీ, గుజరాతీ, హిందూస్తానీ, ఇంగ్లీషు— నానాభాషల కలకలం— లక్ష కందిరీగల రొద. ఎంతకూ పొద్దు గడవదు. అరవై సెకండ్లు, ఒక నిమిషం. అరవై నిమిషాలు ఒక గంట. ఒకటి, రెండు, మూడుగంటలు.

నాగసర్పంమాదిరి మెలికలు తిరుగుతూ, సత్తగుల్లవలె అడుగులు వేస్తూ, తేనెటీగల్లా రొదపెడుతూ పొడుగాటి స్త్రీల పంక్తి నిమిష నిమిషానికీ పెరిగిపోతున్నది. పంక్తిలో ముందరి వైపు ఒకావిడ తన గింజలు తీసుకొని వెళ్ళిపోయిందో, ఇద్దరూ ముగ్గురూ వచ్చి పంక్తిలో వెనక వైపు చేరుతూనేయున్నారు. రెండువందలమంది, రెండువందల యాభై, మూడువందలు, మూడువందల యాభైమంది, ఎంతవోపికగా వుదయంనుంచి నిలుచుంటున్నారు! వొకకాలు అలసిపోతే రెండోకాలు మీదికి వొరిగి నిలుచుంటున్నారు. ఓపికకూ, త్యాగానికీ, విశ్వాసానికీ విచిత్రమైన నిదర్శనం. దేవాలయద్వారాలు తెరుచుకోడానికి ఎదిరిచూస్తున్న భక్తులమాదిరి. ఇదొక కొత్తదేవాలయం. హిందువులూ, మహమ్మదీయులూ, కిరస్తానీలూ వచ్చే దేవా

లయం. అంతా భక్తులు. ప్రతివారిచేతిలో ఒకసంచి, అందరి తలల్లో ఒకే ఆలోచన. ఒకే ఆలోచన, ఒకే కోరిక, ఒకే ఆకాంక్ష, ఒక మానెడు బియ్యం గింజలు.

దుర్గ దూరాన పంక్తి కొసలో వచ్చిచేరింది. ఇవాళ రోజుటి కంటె ఆలస్యంగా వచ్చింది. వుదయాన వొళ్లంతా నెప్పులతో లేచింది. ధాన్యంషాపుకుపోయి గంటలతరబడి నిలుచునే ఓపిక లేదు దుర్గకు. కాని పోనిదే వేరే మార్గం లేదు. ఇంట్లో పిడికెడు బియ్యం లేవు. గత రెండు రోజుల్లో బజారు లోనే అన్నం కొనుక్కోవలసి వచ్చింది. మళ్ళీ ఇన్ని నాళ్ళకు ఇవాళ ధాన్యంషాపు తెరిచారు. ఇవాళ రేషన్ తీసుకోకపోతే మళ్ళీ షాపు ఎన్నాళ్ళకు తెరుస్తారో దేవుడికే తెలియాలి. ఈ లోపల తనకు పురుడొస్తే......

దుర్గ మొగుడు మిల్లులో పనిచేస్తాడు. ఉదయాన మిల్లుకు వెళ్ళితే, రెక్కలు ముక్కలు చేసుకుని, విసిగి వేసారి సాయంత్రానికి ఉసూరుమంటూ ఇంటికి వస్తాడు. ఇంటిపనంతా దుర్గ చూసుకోవలసిందే. దుర్గకు అదేమంత లెక్కలోదికాదు. తల్లిగారింట్లో వున్నప్పుడు పొలాల్లో పనిచేసేది. ఇంట్లో రాటం తిప్పేది, పిండి విసిరేది, గొడ్లకు కుడితి చేసేది, ఆవులపాలు పిండేది, పేడ పిడకలుచేసి ఆరవేసేది. తల్లిగారింటినుంచి మొగుడుతో పట్నంవచ్చి తానుగూడా మిల్లులో పనిచేయ సాగింది. 'నందు' తన మొగుడైనందుకు గర్వించేది దుర్గ. 'నందు'కు బజారుభోజనం సయించదు కనుక సాయంత్రంపూట అన్నంవండేది. పగులల్లా పనిచేసి మళ్ళీ సాయంత్రం అన్నం

పోండవలసి వచ్చినా విసుగనిపించేదికాదు. నందూకోసం తనను యేదిచేయమన్నా చేస్తుంది దుర్గ. నందు ఎంత మంచి వాడు! ఎన్ని విచిత్రాలు చూపించాడు తనకు! మ్యూజియం, చౌపట్టీ, ఆపాలో బందర్. పెద్ద పెద్ద పడవలు నీలిసముద్రాలు దాటి దూరదేశాలకు వెళ్ళిపోతుండగా చూపించాడు. నందూ తనను సినిమాలకు తీసుకోవెళ్ళేవాడు. అందులో ఎన్నో చిత్రాలు జరిగేవి. దేవుళ్ళూ, దెయ్యాలూ, మనుషులూ ఆ చిన్ని గుడ్డ తెరమీద దర్శనం యిచ్చేవాళ్ళు. పల్లెలో వున్నప్పుడు ఈ విచిత్రాలను కలలోనైనా చూడలేదు.

నందు ఎల్లప్పుడూ దుర్గను దయతో చూచేవాడు. జీతాలు పడ్డరోజున సైతం ఇతరకూలీలవలె తాగి తందనా లాడుతూ వచ్చేవాడు కాదు యింటికి. పెళ్ళాన్ని ఎప్పుడూ కొట్టే వాడు కాదు. ఆరో నెల రాకముందే దుర్గను మిల్లుపని మాన్పించాడు నందు.

'ఇహ నువ్వు మిల్లుపని చేయకూడదు. ఇంటిలో నేవుండి విశ్రాంతి తీసుకో. నువ్వు బిడ్డను కనబోతున్నావు కదా' అన్నాడు. మళ్ళీ పట్టరానిసంతోషంతో "దుర్గా! చూస్తూండు, నువ్వు నాకోసం మగ బిడ్డను కనాలి. నాకు పెడబొబ్బలు పెట్టే ఆడ బిడ్డ అక్కర్లేదు' అన్నాడు.

నాగసర్పం మాదిరి మెలికెలు తిరుగుతూ, నర్తకుల వలె అడుగులు వేస్తూ, తేనెటీగల్లా రొద పెడుతూ స్త్రీలపంక్తి మెల్లమెల్లగా ధాన్యం పాపువైపు నడుస్తున్నది. దుర్గ వెనక ఒక డజనుమంది స్త్రీలు మిగిలిపోయారు. వాళ్ళలో పాదోష

వాదాలు సాగుతున్నై. ఒక పారిసీ ఆవిడ ధరలు పెరగడాన్ని గురించి చర్చిస్తున్నది. ఒక 'భోజా' స్త్రీ గింజకరువుకు కాంగ్రెసును నిందిస్తున్నది. ఒక కిరస్తానీపడతి 'ఇదంతా గాంధీ తప్పిదం' అన్నది. 'గాంధీజీ ప్రభుత్వాన్ని రెచ్చగొట్టకపోతే ప్రభుత్వం ఈ విధంగా ప్రజల్ని యేడిపించేది కాదు. కూటికి గింజలు దొరక్క-పోయేవి కావు' అంది.

ఇంతలో ఒక లావాటి నెరిసిన వెంట్రుకల గుజరాతీ యిల్లాలు అందుకుంది. "మీరు కాంగ్రెసును, గాంధీజీని యెందుకు తిట్టిపోస్తారు? గవర్నమెంటులక్షుల లక్షుల టన్నులధాన్యం ఇరాను, ఇరాఖు, ఈజిప్టులకు పంపినమాట జ్ఞాపకం వుందా?" అంది.

"గవర్నమెంటు ధాన్యాన్ని దేశదేశాలకు పంపినమాటా నిజమే. కాని మనవాళ్లుమాత్రం మంచివాళ్లా! చూడండి. ఈ కోమట్లాళ్లు కావలసినంత ధాన్యం స్టాకుచేసుకుని మెల్లమెల్లగా బ్లాకుమార్కెట్టులో పెద్దపెద్ద ధరలకు అమ్ముతున్నారు"అన్నది మహారాష్ట్ర స్త్రీ.

'నిజం! నిజం! వెధవ నూనెకు గింజలకోసం అయిదు, ఆరు గంటలు వుసూరుమంటూ ఎండలో నిలుచొని చస్తుంటే, కోమట్లాళ్లు వేలమణుగుల ధాన్యం అసలు ఖరీదుకు మూడు రెట్లుచేసి అమ్ముతున్నారు"

"అట్లా చేసే దొంగల్ని ఉరితీయాలి"

"ఇతరదేశాల్లో అట్లాగే చేశారు. ఇక్కడ మన ప్రభుత్వం దొంగవ్యాపారులకు 'రావుబహద్దూర్! ఖాన్‌బహా

ద్రూక్, బిరుదులు యిస్తుంది. ఈ బిరుదులవాళ్లు యుద్ధ కంట్రాక్టులు తీసుకుని యింకా బలుస్తారు."

ఇంకో గుంపు గతయుద్ధాన్ని గురించి చర్చిస్తున్నది.

"అక్కా! జర్మనీ, జపాన్ ఇద్దరూ ఒకటే. అవకాశం దొరికితే జర్మనీమాదిరి జపాన్‌కూడా రష్యాను దెబ్బతీస్తుంది"

"చావు దగ్గరపడ్డ నక్క వూళ్లోకి వురికొచ్చినట్టుంది! జపాను రష్యామీద నే దాడిచేసిరాదు! జపాన్ నాశనమైందన్న మాటే. బర్మా, ఫిలిప్పీన్ అనుకున్నారేం రష్యాను? రష్యా రష్యాయే."

"రష్యా!"

ఎండలో నుంచున్న దుర్గ తలతిరిగిపోతోంది, కాని ఆలోచనలు ఆగలేదు.

'రష్యా! అనగా ఎక్కడో విన్నానే' అనుకుంది దుర్గ. దుర్గకూ రష్యాకు ఏదో బంధుత్వం వున్నట్టు అనిపించింది. దుర్గకు జ్ఞాపకం వచ్చింది. నంసు వొకమాటు తనను వొక బహిరంగసభకు తీసుకోవెళ్లాడు. ముప్పైవేల కార్మికులు, స్త్రీలూ, పురుషులూ పెద్ద మైదానంలో కూచున్నారు. దుర్గ తన జీవితంలో యెన్నడూ అంత జనం గుమికూడడంచూడ లేదు. సముద్రంలో నీటిచుక్కమాదిరి అనిపించింది దుర్గ. అన్ని వైపులా యెర్రజండాలు. వాటిమీద తెల్లటి కొడవలి తనతండ్రి పంట కోసేప్పుడు చేతులో పట్టుకొనే కొడవలి మాదిరిది. దాని మీదఒక సుత్తి. కమ్మరాడు ఎర్రటి యినప కమ్మీని లొంగతీస్తున్నప్పుడు తానుచూచిన సుత్తి. ఆ జనసమూహం మధ్యయె

త్తయిన గద్దె. దాని మీదినుంచి ప్రజలకు యేమిటో చెబుతున్నారు. ఆ గద్దెమీద మాట్లాడేమనిషి ధ్వని తాను కూచున్న చోటికి దగ్గరగా వున్న స్తంభానికి కట్టివున్న నల్లని, పెద్ద బాకా మాదిరి దాంట్లోనుంచి వినవొస్తున్నది. అది సామాన్యమైన మనిషి గొంతుచప్పుడుకాదు. నూయిలోనుంచి మాట్లాడుతున్నట్టు వినవస్తున్నది.

'సోదరీ! సోదరులారా! ప్రజల నెత్తురు తాగే హిట్లర్ గాడి తోడేళ్లు రష్యామీద దాడిచేశాయి. ప్రపంచశ్రమజీవుల జన్మభూమి రష్యా. ప్రపంచంలో కర్షకులూ, కార్మికులూ పరిపాలించుకునే వొకే వొకదేశం రష్యా. రష్యాను రక్షించడానికి ప్రపంచకార్మికులంతా నడుం బిగించాలి.'

'సోవియట్‌రష్యా జిందాబాద్' అని ముప్పైవేలకార్మికుల గొంతులూ అరవగానే దుర్గకు భయంవేసింది. మిన్ను విరిగి మీదపడ్డట్టయింది.

ఎంతసేపటినించి నుంచోనివుంది తాను! వెనక్కి తిరిగి చూచింది. ఇంకా ఇరవైమంది తన వెనకవున్నారు. ఇప్పుడు ధాన్యంషాపు సైన్ బోర్డు ఎర్రగా కనుపిస్తున్నది. కాని, ఇప్పటికీ తనకూ తన మానెడు గింజలకూ మధ్య నూరుమంది స్త్రీలు మిగిలివున్నారు. 'మానెడు గింజలు కొలవడానికి ఇంతసేపు యేంచేస్తాడు కోమటి,? ఆశ్చర్యపడింది. విసుక్కుంది. తన శరీరం బరువును ఒక కాలుమీదనుంచి ఇంకో కాలుమీదకి మార్చుకుంది. మితిమీరిన యెండవల్ల ఆడవాళ్ళు వాగడం మానేశారు. ఒక పోలీసువాడు నీలిరంగు డ్రెస్సులో, ఎదు

రుగావున్న గద్దెమీద చెట్టునీడను కళ్ళుమూసుకుని పడు
కున్నాడు. నిద్రపోయి వుంటాడు. శరీరంలో బడలిక, కాళ్లలో
తీపులు, నడుముల్లో కొరుక్కుతినే నెప్పి కళ్ళల్లో కేంద్రీక
రించుకుని అతనివైపు చూచింది దుర్గ. ఆచల్లని గద్దెమీద
తానే పడుకుని నిద్రపోయినట్టు భావించుకుంది. ఆస్థితిలో
వొళ్ళు సొలిగి కింద పడేదై మళ్ళీ సర్దుకుంది. తనముందు
వున్నావిడ బుజం పట్టుకుని నుంచుంది.

'ఏవమ్మాయ్! కాళ్లమీద నుంచోలేవూ?' అంది
ఒకచురుకైన ముసలావిడ. ఆవిడమాటల్లో కోపంగాని, ద్వేషం
గాని లేదు. దుర్గ తన బలహీనతకు చాలా సిగ్గుపడ్డది వెనక్కు
అడుగు వేసింది.

'కళ్ళు లేవూ! కాలు తొక్కుతావేం' అని వెనక
నుంచి విసురుగా అరిచింది వోకావిడ. ఈ తిట్లూ, దీవెన్లూ
నానా భాషల్లో దూరందాకా నడిచాయి.

తనకు పెద్ద అవమాన జరిగినట్లు భావించుకుంది దుర్గ.
పళ్ళు బిగబట్టి, చూపులు నేలమీద నిలిపి సరిగా నిలబడడానికి
ప్రయత్నించింది. అది సాధ్యపడనట్టు గుర్తించి గింజలు లేకున్నా
మానె, ఇంటికి వెళ్ళిపోదామనుకుంది. అంతలో నందూ జ్ఞాపకం
వొచ్చాడు. సాయంత్రం నందూ ఏంతింటాడు? ప్రియమైన
నందూ ఈ రోజుల్లో తనకోసం 'ఓవర్ టైం వర్కు' చేస్తు
న్నాడు.

షాపుసమీపానికి వచ్చేసింది. ఇంకా వొక్క అరగంట
దాటేస్తే గింజలు సంచిలో పడతై ఇంటికి వెళ్ళొచ్చు.

ఈ నెప్పియేమిటి? తనను సగానికి నరుకుతున్నట్టు నెప్పి. గుడ్డలతో స్నానంచేసినట్టు చెమట కారుతున్నది. తల తిరిగిపోతున్నది. నెప్పి తరంగాలు తరంగాలుగా లేస్తూ తగ్గుతూ వున్నది. పదునైన కత్తితో మాటిమాటికీ పొడుస్తున్నట్టున్నది. ఇన్నినాళ్ళనుంచి యెదిరిచూస్తున్న గడియ అప్పుడేవొచ్చేసిందా? అదికాకపోవొచ్చు. మొన్న మంత్రసాని చెప్పిపోయింది ఇంకా రెండువారాలు కావాలని. ఇది ఇంకేదో నెప్పి అయివుండాలి.

ఊహిస్తూ, ఆలోచిస్తూ, చింతిస్తూ, తనని ఏ క్షణానో మింగివేయ జూస్తున్న వేదనా తుఫానును ఎదిరిస్తూ, ఎలాగో సర్దుకుంటూ పంక్తివెంటనడుస్తున్నది. ధాన్యం షాపువచ్చేసింది. ఒకేఒకావిడ తన ముందు మిగిలింది. గింజలు తీసుకోడాని రెండు కర్రమెట్లుయెక్కి ఆవిడ షాపులోకి పోతుంటే దుర్గకు భయంవేసింది. రెండు కర్రమెట్లు! ఒక్కొక్క అడుగు యెత్తు మెట్లు! యెట్లా యెక్కడం. తన తల్లిగారి వూళ్లో కొండమీద దేవుణ్ణి చూడ్డానికి యెక్కిన నూటాయిరవై మెట్లమాదిరి అనిపించినై ఆ రెండుమెట్లు. యెట్లా యెక్కడం? తన ముందావిడ గింజలు తీసుకుని విజయసూచకంగా నవ్వుతూ, మొహంమీది చెమట చీరెకొంగుతో తుడుచుకుంటూ దిగివచ్చింది. వెనకావిడ ఒక నెట్టు నెట్టింది దుర్గను. 'ఏయ్! పదవేం! నిద్రపోతున్నావా?' అంది. కోమటాడు దుర్గనైపు చూచి "త్వరగా రావమ్మా! నీవెనక యింకా వున్నారు' అన్నాడే కాని దుర్గ మొహంలోని వేదన, దౌర్బల్యం, మెట్లు యెక్కబోతున్న కాళ్లలోని వణకూ చూచాడా?

"నేను... నేను... నేను మొక్కలేను... గింజలు కిందికి అందివ్వ నాయనా!" అంది దుర్గ. దుర్గ పెదవులు ఎండి పోయినై. గొంతు తేలిపోయింది. "ఏం! నీ తలలో పించం వుందా నీకు అందివ్వడానికి? అందరిమాదిరి పైకివచ్చి తీసుకో"

"పదా! నడూ!"

"నీకు అవసరం లేకుంటే తొలుగు. ఇంకొకళ్ళకిస్తా."

మొట్టుమొట్టుగా పడిపోతున్నా ననుకుంటోంది దుర్గ. ఎలాగో శరీరాన్ని షాపులోకి చేరవేసింది. వొణుకుతూ కోమటికి యిచ్చింది సంచీ. నాలుగు గంటల్నించి చేతిలో చెమటకు తడిసిన డబ్బులూ యిచ్చింది. మానికలో బియ్యం దుర్గసంచిలో పోశాడు కోమటి. కోమటి గిరగిరా తిరుగుతున్నట్లు అనిపించింది దుర్గకు. కొలమానికా, బియ్యం బస్తా, మొత్తం షాపూ గిరగిరా తిరుగుతున్నాయి. గిరగిరా, గిరగిరా, గిరగిరా తిరుగుతున్న షాపూ, బియ్యం బస్తాలూ, నేతిడబ్బాలూ, హనుమంతుని పఠం దుర్గమొహాన ఫెళ్ళున పడ్డై. కెవ్వుమన్నది దుర్గ.

తనను పెద్ద బియ్యపురాశి అడుగున పాతిపెట్టా రనుకుంది. ఊపిరాడక ఉక్కిరిబిక్కిరైంది. మళ్ళీ అంతలోనే ఎవరో ఆ బియ్యం తన మీదినుంచి తోడేశారు. మళ్ళీ ఊపిరిఆడింది. దుర్గ కళ్ళువిప్పి చూచింది. బియ్యంకోసం నుంచున్న ఆడవాళ్ళ సంచుల్లో బియ్యం కొలిచి పోస్తున్నాడు హనుమంతుడు. "ఇదిగో, మానెడు బియ్యం! ఇదిగో, మానెడు బియ్యం!" అంటున్నాడు. అతని పొడుగాటి తోక సంతోషంతో ఆడుతున్నది. కాదు! అది హనుమంతుని తోక కాదు. పెద్దనాగసర్పం. తనను

తిట్టిన ఆవిడ మొహంతో నాగసర్పం. ఆ సర్పం అంతలో వుబ్బి ఎంత పొడుగైదేం! చాలా పొడుగు. పాకుతూ, మెలికలు తిరుగుతూ తనవైపే వస్తున్నది. నాగసర్పం శ్వాస పీల్చుకుంది. తాను దాని పొట్టలోకి దిగిపోయింది.

నిజంగా అది నాగసర్పం పొట్టకాదు. చీకటి గది. ఊపిరాడని చీకటిగది. గాలే లేదు. మళ్ళీ ఊపిరాడడం లేదు. ఆ అగాధపు చీకటిలోనుంచి ఏదో కేక, "ఇది భారతదేశం! ఇది భారతదేశం!" దూరాన రెండు యెర్రని లైట్లు మండుతున్నాయి. నాగసర్పం కళ్లు అనుకుంది దుర్గ. అవి దగ్గరికి, దగ్గరికి వచ్చినై. రెండు సుత్తీకొడవలి యెర్ర జెండాలు. ఇప్పుడు అంతటా వెలుతురే. వేలకార్మికులు సాగిపోతున్నారు. ఏదో భాషలో పాటలు పాడుతూ, నుయ్యిలోనుంచి పెద్ద ధ్వని వినిపించింది. "రష్యారష్యాయే" వెంటనే నల్లమేఘాలు సూర్యుణ్ణి కప్పినై. మెరుపులూ,ఉరుములూ,కాదు,కాదు తుపాకీల మోత. బాంబులు కురుస్తున్నై. అన్నివైపులా విరుసు కుంటున్నై. సినిమాలో వొకప్పుడు ఇట్లాటివి చూచింది దుర్గ. వొక బాంబు తనదెగ్గరగా పడ్డది. తాను ముక్కలు ముక్కలైచెదిరి పోయింది.

తాను నగ్నంగా వున్నట్టనిపించింది. చాలా సిగ్గుపడ్డది. నేలమీాదనుంచి లేచేలోపల ఒక భయంకరమైన పిశాచం తన శరీరాన్ని ముక్కలుగా నరుకుతున్నట్టనిపించింది. బాగా చూచింది. అతడు నందు. నవ్వుతూ తనను నరుకుతున్నాడు. "దుర్గా! ఇటుచూడు నువు నాకోసం మగ బిడ్డణ్ణి కనాలి సుమా"! అంటున్నాడు. వేలమంది జనం చుట్టూమూగి

ఈ పరిస్థితి చూస్తున్నారు. నవ్వుతున్నారు. వాళ్ళల్లో ఒకడు "ఇది భారతదేశం"అన్నాడు. ఒక గుజరాతీ లావుపాటియిల్లాలు.

"గాంధీజీని యెందుకు తిడతారు ? ఇంగ్లీషు వాళ్ళవల్ల ఆయనకూడా పస్తులుంటున్నాడు." అంది.

అంతా మాయమై పోయారు. గుర్రకడుపు లావై పోతు న్నది. చాలా లావు. కోమటాడి పొట్టకంటె లావుగా పొంగు తున్నది. ఇంతలో యెవరో వొక పెద్ద పసునైనసూదితో పొడి చారు. రక్తం మడుగులు కట్టుతున్నది. గుడ్డలన్నీ నెత్తురులో తడిసినై. దూరాన ఎవడో తన మెదడుతలుపు మీద తడు తున్నాడు. ఎవళ్లో మాట్లాడుకుంటున్నారు. నిస్పృహాలోనుంచి తొంగిచూచి గిరగిరా తిరుగుతున్నది భాస్యంపాపు. నెమ్మదిగా ప్రశాంతి. హనుమంతుని పటం గోడమీద వ్రేలాడుతున్నది. దుర్బలంగా వుంది శరీరం. తల యిటుతిప్పి చుట్టూవున్న ప్రజల్ని చూడలేకపోయింది దుర్గ. వాళ్లు మాట్లాడుకుంటున్నారు. దుర్గకు అన్నిమాటలు వినపడలేదు. విన్నవిమాత్రం ఇవే.

"పాపం! ఇదే మొదటికాన్పు......"

"చిత్రం! అంతా దేవుడిమాయ"

"ఇలాంటి చోటనా!... ......"

"ఎవతో! కూలిమనిషి......"

"అంతా వెళ్ళిపోండి! ఇది తమాషాకాదు"

దుర్గకు ఏదో పెద్దబరువు దిగిపోయినట్లైంది. చేయి కది లించింది. గుడ్డలన్నీ తడిగా తగిలినై. నీళ్లా? చెమటా? కాదు రక్తం! భయంకరమైన ఊహ మెదడులో పరిగెత్తింది.

"ఇక్కడ... ఇంతలోకం ముందర... బిడ్డను కన్నాను.

ఇంతకంటె సిగ్గుచేటువుంది!" ఇక్కడే ఇప్పుడే భూమిపగిలి, విచ్చుకుని తననూ, తనకు వచ్చిన అపకీర్తినీ మింగేస్తేబావుండు. చావునయం ఇలాంటి గతికంటె. దౌర్బల్యపుతరంగం వొకటి దుర్గమీద విసురుకుంది. కళ్లుమూసుకుంది దుర్గ. 'ఇక్కడినుంచి యెట్లా వెళ్లిపోవడం? ఎట్లా ఈ ప్రజలకు మళ్ళీ మొహం చూపడం? ప్రతివాడూ బజారులో వేలెత్తిచూపుతాడే!'

చాలాసేపు అలాగే లజ్జతో నిస్పృహతో పడివుంది. మళ్ళీ మూర్ఛలాంటిది ఆవరిస్తున్నట్టున్నది. ఇంతలో......

పసిబిడ్డడి అరుపు

"పసిబిడ్డడు ! ఎవరి పసిబిడ్డడు ! తన బిడ్డడా ! దుర్గ బిడ్డడు ! సందూ బిడ్డడు"

కోమలమైన సన్నని ధ్వని గొప్పపాటులో తన లజ్జనీ, తత్తరపాటునీ ఊడ్చేసింది. దౌర్బల్య నిస్పృహ మేఘాలు దుర్గ తలలోనుంచి తొలిగి పోయినై. బాధను మరిచిపోయి తల యిటుతిప్పి చూచేసరికి మెత్తని మాంసంముద్ద చింకిపాతల్లో కనిపించాడు. ఆచిన్ని నోటిలోనుంచి వచ్చే కేకలుతల్లికిమాత్రమే తెలియాలి. 'ఆకిలికామాలు' అనుకుని రవికవొదులు చేసింది.

ఆ మాతృత్వంలోని గౌరవం దుర్గను వింతగా చూస్తున్న వాళ్ళని 'సిగ్గు ! సిగ్గు' అని అవతలికి నెళ్ళగొట్టింది. అంతా నవ్వుతూ వెళ్ళిపోయారు.

కొంతసేపటికి గోడను ఆనుచేసుకుని లేచి నుంచుంది. వణుకుతూకూడా విజయసూచకమైన అడుగులతో వెళ్ళి పోయింది దుర్గ. ఒక చేతిలో బిడ్డడు, ఒక చేతిలో సంచీ, సంచిలో మానెడు బియ్యంగింజలు. (అబ్బాస్ ఇంగ్లీషు కథకు అనువాదం)

# వడిశాల

తూరుపు ఆకాశంలో తొంగి చూస్తోంది యెర్రని విషపు కోరలాంటి చంద్రవంక. బహుళద్వాదశి రాత్రిమూడో జాము. కొరికివేస్తున్నచలి, అంతా నిశ్శబ్దం.

వూరవతల కొండకొమ్మున కునికిపాట్లు పడుతున్నది మొంకాం. ఉలిక్కిపడి మేలుకుంటున్నది. నలుదిక్కులా కలయచూచి మళ్ళీ కునుకుతున్నది. చిరిగిన గొంగళిలోనుంచి చలి ఝడిపిస్తోంది.

మా వూరి చుట్టుప్రక్కల గ్రామాలమీద వారం రోజుల్నించీ మిలిటరీ దాడి జరుగుతోనే వుంది. ఏక్షణాన మావూరిమీద విరుచుకు పడతారో తెలీదు. కొండకొమ్మున మిలిటరీ రాకను గమనించడానికి మొంకాంను నియమించాం. మొంకాం దగ్గర ఒక యెద్దుకొమ్ము, ఒక వడిశాల, గంపెడు గులకరాళ్లు వున్నై. వారంరోజుల్నించి మొంకాంకు నిద్రలేదు. కళ్లు కాకలెక్కిపోయినై. రెప్పలు వాలిపోతున్నై.

'కుప్, కుప్, కుప్, కుప్.'

బెదరిపడి చూచింది మొంకాం చీకట్లోకి. కొండ క్రింది అంచున యెవళ్లో వూళ్లోకి నడుస్తున్నారు నల్లగా దెయ్యాలకు మల్లే. మిలిటరీ? అవును! కొమ్మందుకుంది మొంకాం. భు భు భుం,

భు భు భుం పూదుతోంది. పంటచేలల్లో దాక్కునివున్న వలంటీరు దళం మేలుకుంది. గ్రామంలో పెద్ద కోలాహలం. ఒక వేయి మిలిటరీ గ్రామం చుట్టుముట్టింది. తుపాకుల మ్రోతతో ఆకాశం చిల్లులుపడ్డట్టుంది. యెంకాం కొమ్ము పూదుతూనే వుంది. గ్రామగ్రామాల వలంటీరుదళాలు పరుగెత్తుకో వొస్తున్నాయి. మిలిటరీవాళ్ల టార్చిలైట్లు కొండనెత్తమ్ములల్లో కొమ్మూదే యెంకాం కోసం వెదుకుతున్నాయి. బండరాయి చాటున దాక్కుని కొమ్ము పూదుతోంది యెంకాం.

'ఆంధ్రమహాసభకీ జై'

పెద్ద ప్రజాసమూహం మిలిటరీపైకురికింది. యెంకాం కొమ్మూదడం ఆపి వొడినిండా రాళ్లూ, చేతిలో వడిశాల పట్టుకుని చాటుచాటుగా కొండ దిగింది. బండకు కాలుమోపి వడిశాల విసురుతోంది యెంకాం. వందల టార్చిలు కొండంతా తడుము కుంటున్నాయి. యెంకాం రాళ్లు విసురుతోంది. రంయి మని శరవేగంతో పరిగెత్తే వడిశాలరాళ్లు చీకట్లో సోల్జర్ల బుర్రల్లో గంగిరెత్తిస్తోన్నై. వడిశాలరాళ్ల తీవ్రతకు తుపాకీగుళ్లు దాసోహాం చేస్తున్నై.

సోల్జర్లు తుపాకీలను వీధుల్లోకి కాలుస్తున్నారు. ప్రజలు ఇళ్ల వెనకాలా, చేలల్లోదాక్కుని వడిశాలలు విసురుతున్నారు. తుపాకీలగురి తప్పిపోతోంది. సార్జెంటు 'మెషీన్‌గన్' వాడడా

నికి ఆర్డర్ చేశాడు. యెంకాం కొంకను వదిలేసి జొన్న చేలో చొరబడింది. తుపాకీగుళ్ళకు జొన్నకంకులు తెగిపడుతున్నాయి. యెవరది? తటాలున ఆగిచూచింది.

"నేను...... నేను రాఘవయ్యను యెంకాం" అని గొణిగాడు ఆంధ్రమహాసభ గ్రామకమిటీ అధ్యక్షుడు.

"రాగవయిగోరూ! నూ దొరికితే మేం నాశినమే. మెల్లిగా కొండదాటండి" అంది యెంకాం సన్నగా. "మరి నువ్వు?" అన్నాడు రాఘవయ్య.

"నేను వూళ్లోకి"

"వొద్దు! బాంబులుకూడా విసురుతున్నారు" అన్నాడు రాఘవయ్య.

"వూళ్ళో ఆడాళ్ళను ఏంచేస్తన్నారో" అంది యెంకాం.

"నువువెళ్లడం బాగాలేదు" అన్నాడు రాఘవయ్య.

"వెళ్ళనీండి" అంటూ యెంకాం రాఘవయ్యను దాటి నడిచింది. వూళ్ళో దారిమలుపున ఆగి జొన్నచేను అంచున నిలుచుని వడిశాల విసరడం సాగించింది.

"అమ్మబాబో" దభేలున కూలింది యెంకాం. "బైనెట్" కుడికాలి పిక్కలోదిగింది. పక్కగావొంగి చూచింది యెంకాం. నలుగురు మిలిటరీ దెయ్యాలు.

"ఒసేవ్! యెవత్తవే" సోల్జరు వురిమాడు యెంకాం మాట్లాడలేదు.

" ఇదీ ఆంధ్రసంఘుందే " అన్నాడు రెండో సోల్జరు.

" మీా రాగవయ్య దాగుం డెక్కడ చెప్పు ? "

" ..................... "

" ఒసేవ్ ! నిన్నే ! చెప్పవేం ముండా ! "

" నాకు తెలీదు " అంది యెంకాం.

" తెలీదూ ! ఇటురాలా యిప్పాడు. "

" ఉఁ హుఁ " అంది యెంకాం

" ఇట్లా అడుగుతే చెప్పా "

అంటూ ఒకసోల్జరు యెంకాంను వెల్లికిల దొర్లించాడు.

" ఒరే యిక్కడ వొద్దురా ! గొరిల్లాలు వొస్తారు " అన్నాడు యింకో సోల్జరు. " కారులో వేసుకోపోదాం " అన్నాడు. కాలు పిక్కలోనుంచి కారుతున్న నెత్తురులో ఎంకాం తడిసి పోతున్నది. మిలిటరీవాళ్ల కారు కదిలింది.

తెలతెలవార వొస్తోంది. మసకలో తాటి చెట్లచాటున ఆగిందికారు.

యెంకాంను కిందికి లాగివేశారు సోల్జర్లు. గాయాన్ని అరచేతితో అణుచుకుంటూ లేచికూచుంది యెంకాం. సార్జెంటు యెంకాంని సమీాపించాడు.

" ఒసేవ్ ! మంచి మాటల్తో చెప్పు ! రాఘవయ్య యెక్కడున్నాడో."

"…… …… …… …… …… ……"

"కొద్దిగా జాడ చెప్పు"

"మిలిటరీ జులుం నశించాలి" అంది యెంకాం. సోల్జర్లు యెంకాంను అణిచి పట్టారు.

"యెందుకు వాట్టిపుణ్యానికి చస్తావు! చెప్పు" అన్నాడు సార్జెంటు.

"మా సంఘంకోసం ఛస్తాను" అంది యెంకాం.

"ఛస్తావ్ గాని చెప్పవా?" అన్నాడు సార్జెంటు.

"నాకు తెలీందే" అంది యెంకాం. యెంకాం చీరెలాగేశాడు సార్జెంటు.

"హమ్మ" అని అరిచింది యెంకాం. సార్జెంటు చేతిలోని బాకు దిగింది. టప, టప, టప, టప రాళ్లుపడ్డై. సోల్జర్లు యెంకాంను విడిచిపెట్టి పారిపోయారు. యెంకాం కాలునుంచి కారిన నెత్తురుచారలగుర్తులు వెనక్కుంటూ నలభైమంది వలంటీర్ల గుంపు వడిశాలలు విసురుతూ వస్తోంది. చెట్లూ, పుట్టా వెదుకుతున్నారు వలంటీర్లు.

"ఆంధ్రమహాసభకీ జై" అని అరిచారు బిగ్గరగా. వొంగిన తాటిమ్రానుకింద యెంకాం పడివుంది. రాఘవయ్య చూచాడు. యీలవేశాడు. వలంటీర్లు గబగబా వొచ్చారు. అంతా చుట్టు

మూగారు. మసకమసక చీకట్లో యెంకాం కొసప్రాణంతో పడి వుంది.

"యెంకాం!" అన్నాడు రాఘవయ్య

"ఆంధ్రసంఘం" అంది యెంకాం మెల్లిగా

"......కీ జై" అన్నారు అంతా. అంతలో చల్లబడిపోయివ యెంకాం శవంపై కన్నీళ్ళు జార్చాడు రాఘవయ్య.



---

Printed at Abhyudaya Press, Bezwada. for 'Teluguthota Grandha Mandali' K 61, 300 Copies. 24-9-47.